# నసీబ్

రచన

వైద్యుల శ్రీనివాసరావు

ప్రచురణ :

విజయ పబ్లికేషన్స్

7/319 సీతన్నపేట, విజయవాడ-2.

మొదటికూర్పు
1000 ప్రతులు
1951

## సూచన

ఈ నాటికకుగల సర్వహక్కులు విజయ పబ్లికేషన్స్‌వారికి చెందియున్నవి. ప్రదర్శించదలచిన సమాజములవారు వారి అనుమతి పొందవలసినది.

ఇట్లు
రచయిత
వైద్యుల

ముద్రణ :
కల్యాణి ప్రెస్
విజయవాడ.

# నా మాట

నా రచనలలో ఈ "నసీబ్" ప్రథమమది కాకపోయినా ఈ రూపంలో ప్రథమస్థానం వచ్చింది.

రచించిన రచనలు మూలపెట్టడం సమంజ్యసం కాదని అచ్చువేసి ప్రజలముందు వుంచమని సలహాలిచ్చిన మిత్రులలో ముఖ్యులు రాయసం కవిగారు.

సాటి రచయిత రచనలను ఔదార్యంగా చదివి పురోభి వృద్ధి కోరేవారు నేటి ఈకాలంలో అరుదు. తోటిమానవుని ఉత్సాహపరచటంలో అందెవేసినవారిలో మా రాయసం వెంకట రమణయ్య గారిని ముందు పేర్కొనాలి.

ఈ రచన ఈరూపంలో వచ్చేముందు మిత్రులు చాలా మంది చదివిచూచారు. ఒకటి రెండు సమాజాలు ప్రదర్శించేందుకు ముందుకు వచ్చాయి.

ఈ రచనకు విజయా పబ్లికేషను స్థాపకులు యిస్తూవున్న ప్రోత్సాహం గణనీయమయింది.

నేడు చలన చిత్రకళ యావత్‌దేశంలోను వినోద కాల క్షేపాలకు అగ్రస్థానం అందుకున్నది. ఒకవంక శరపరంపరలుగా
ఈ చలనచిత్రకళపట్ల విమర్శ
నలు వచ్చిపడుతున్నాయి. ఇంతమట్టుకు వచ్చిన విమర్శనలు
కేవలం వకవైపునుంచే.

పరిశ్రమలో కాస్తో కూస్తోవున్న నా పరిచయాన్ని విపు లంగా మీ ముందర వుంచుదామని నా యీ ప్రయత్నం.

సహృదయులు దీనిని ఆదరిస్తారని ఆసిస్తున్నాను.

సత్యనారాయణపురం } శలవు
విజయవాడ. } మీ వైద్యుల.

# ఇందు వచ్చు పాత్రలు

సూరి :— 25 సంవత్సరాలు. అదృష్టంమీద ఆధారపడి కాలంకోసం ఎదురుచూస్తున్నవాడు.

మూర్తి :— 26 సంవత్సరాలు. మూర్తికి ప్రాణమిత్రుడు.

రాజు :— అసిస్టెంటు డైరెక్టరు. వయస్సు 30.

రంగారావు :— ప్రొడక్షన్ మేనేజరు. వయస్సు 35.

రావు :— డైరెక్టరు. వయస్సు 35.

బాయ్ :— ఆఫీసుబాయ్. వయస్సు 16.

కళ :— సినిమాకంపెనీ యజమాని. వయస్సు 20. సూరి జీవితానికి చుక్కాని.

ఇందలి పాత్రలు కేవలం కల్పితాలు. వ్యక్తిగతంగా ఎవ్వరినీ విమర్శించటంలేదు. అందుకు ఎవ్వరూ బుజాలుతడుముకోవద్దు.

రచయిత.

# నసీబ్

## 1వ రంగం

ఊరిచివర మైలురాయివద్ద.

[మూర్తి, సూరి సిగరెట్లు కాలుస్తూ వకరినొకరు అను
కొని ఆలోచిస్తుండగా తెరలేచును]

మూర్తి: చూడు, పెండ్లి చేసుకుంటావా లేదా అని నిక్కచ్చిగా మా ఫాదర్ నిగ్గదీసి అడిగాడు. అదే మోతాదులో నేనూ చేసు కోనని కచ్చితంగా చెప్పేసరికి గుమ్మం చూపించి ఇంట్లోకి అడుగెట్టొద్దన్నాడు.

సూరి : ఇంత మాత్రానికే.

మూర్తి: (సిగరెట్ నేలకుకొట్టి) అవునోయ్. ఆ వయస్సు వాళ్ళకి అంతకంటే మెదడు పనిచెయ్యదు. వాళ్లు తాముపట్టిన కుందేలుకి మూడేకాళ్లు అనేరకం.

సూరి : నాన్‌సెన్స్ జీవితాంతంవరకు ఛాయలా అంటి పెట్టుకొనే విషయాన్ని నిముషాల్లో తేల్చి చెప్పటం మాటలా. నే నయితే ఫాదరయ్యేది....

మూర్తి: (మాట త్రుంచేస్తూ) సావరు ఖర్చులు ఎలా గడుస్తయ్యా అని ఎదురుచూచే మనం ఈ దోలుకూడా మెడకు తగి లించుకొంటే ఇహ అడిగావు అవస్థ!

సూరి : సరేగాని, నీవు ఏదో ఉద్యోగంకోసం ప్రైచేస్తున్నట్లు విన్నాను?

మూర్తి: ఆః మన కెవడిస్తాడోయ్ ఉద్యోగం. గవర్నమెంటు ఆంక్ష తీసేసిందిగానీ, S. S. L. C. క్లాసుతో ముడుచుకు కూర్చో వలసిన వాళ్ళం మన కెక్కడనుంచి వస్తాయ్. M.A.B.L. చదివిన మోహనరావు మోదరన్‌కేఫ్‌కి మానేజరుగిరికి దిగుతే - నెపోలియన్ దండయాత్రలా స్కూల్ ఫైనల్ క్లాసును ప్రతిఏడూ దండయాత్రచేస్తున్న మనకు కనీసం మంచంమిఠాయి దుకాణదారుడైనా ఉద్యోగం ఇవ్వడనుకో. (సిగరెట్ పెట్టి తెరుస్తాడు. ఖాళీగా ఉంటుంది. పారేస్తాడు. సూరి సిగరెట్ పెట్టె తెరుస్తాడు. రెండే సిగరెట్లుంటాయ్. ఒకటి మూర్తికి ఇచ్చి రెండవది తాను తీసుకొని అగ్గిపెట్టె తెరుస్తాడు. పుల్లలుండవ్. అవతల పారేస్తాడు. మూర్తి అగ్గి పెట్టె తీసి వెలిగిస్తాడు. ఇద్దరూ పొగ వదుల్తుంటారు.)

సూరి : మానాన్న నాకు కానీ పుట్టకుండాచేశాడు. అమ్మకు అభి మానమున్నా ఆవిడకీ అందకుండా చేశాడు. సిగరెట్లకి, కాఫీకి నానా అగచాట్లు పడుతున్నాననుకో.

మూర్తి: రెడ్డొచ్చె మొదలాడమన్నట్లుంది నీ వ్యవహారం. నేను నీకంటే ఎక్కువగా అవస్తపడ్తున్నాను. కాని-కాని ఎంత కాలం పడ్తాంలే ఈ బాధ.పదిన్నాళ్లు పడనక్కరలేదు.

సూరి : నీ ధైర్యం ఏమిటోగాని నాకేం పాలుపోవటంలా. ఆస్థి వున్నవాళ్ళ మవటంవల్ల అడిగినవాళ్లు లేదనకుండా అప్పు లిచ్చారు.కాని వాళ్ళకు తీర్చేమార్గం కనపడటంలేదు. దాన్తోపాటు సంపాదించే మార్గమూ కన్పించటంలేదు.

మూ_ర్తి : అరేయ్ సూరి! దిగులుపడి చేసేదేమయినా ఉందా? నేను జ్యోతిష్శాస్త్రజ్ఞుడ్ని అడిగాను. "మంచిని అనుభవించ బోయేముందు కష్టపడాలి" అన్నాడు. నిజంగూడా అంతేనని నాకూ తట్టింది. చూడు, గులాబీపువ్వు అందంకలదే. చూ_స్తే వదిలిపెట్టం. కానీ దాన్ని చెట్టునుంచి కోసేటప్పుడు చుట్టూ వున్న ముళ్ళు గుచ్చుకొని ర_క్తం ప్రవహిస్తుంది. నానాఅవస్థ పడ్తాం. పువ్వు చేతిలోకొచ్చి ఆ వాసన మన నాసికలకు తగిలేసరికి, దాన్నిపొందటానికి మనం పడ్డ శ్రమంతా ఇట్టే మర్చిపోతాం. కనుక కష్టాలను ఎన్నివిధాల ఆహ్వానించాలో అన్నివిధాలా ఆహ్వానించుదాం. ఇదంతా మన మంచి కోసమే అనుకో.

సూరి : (కాసేపాలోచించి) బాగానేఉంది. కానీ నాకో సందేహం. రేపనేది ఉన్నదనే ఆలోచనతో గాలిమేడలు కట్టుకొనే కంటే యీపూట సంగతి ఆలోచించుకొంటే మంచిదేమో.

మూ_ర్తి : అట్లా అనుకుంటే జీవితం వక్క అడుగుకూడా ముందుకు జరగదు.

సూరి : కాఫీ త్రాగలేదు ప్రొద్దుటనుంచి. రేపయినా త్రాగుతాంలే అని గుటకలు మింగి సంతృ_ప్తిప_డ్తే ఈపూట ఈతనువు నిల బడే దెట్టాగోయ్?

మూ_ర్తి : ఆమాట ఇందాకటినుంచి చెప్పావుకాదేం. పద, జ్వాలాపతి గాడిపని పడ్దాం.

సూరి : వాడిదగ్గరకు నేను రాను. నిన్న నన్ను నాలుగూ దులిపాడు. ఇన్ని కాగితాలు, కలం పట్టుకొచ్చిపెట్టమన్నాడు. వాడి

పుస్తకం చాల్టంలేదట.పాపం వాడేం చేస్తాడు.ఖర్చు కన పడ్తోందిగాని జమ లేదాయె—

మూర్తి : ఏడ్చాడు.ఆట్టే అరుస్తే అరవదేశం తోలుదాం.తొత్తు కొడుకు బాబాయిగారి సొమ్ములా కూడగడుతున్నాడు.

సూరి : అరేయ్! ఈగొడవకేంగాని మార్గం ఏదైనావెతకరా బాబు.

మూర్తి: ఆత్మారాముణ్ణి తృప్తిపర్చవోయ్.ఆతర్వాత ఆలోచిద్దాం.

సూరి : కాఫీ కాకపోతే కప్పు మంచినీళ్ళైనా త్రాగి సంతృప్తి పడవ చ్చులే. ముందుమాట?

మూర్తి: ఒక్కటే ఆలోచనరా బాబు. మదరాసు వెళ్ళి సినిమా కంపెనీలో చేరుదాం.

సూరి : ఆ! అవునురోయ్. భలే ఆలోచన. సినిమా కంపెనీవాళ్ళు సరికొత్త సరుకు కావాలని తాటికాయంత అక్షరాల్తో పత్రి కల్లో ప్రకటనలుచేస్తున్నారు. అదృష్టం తుళ్ళి మనరొట్టి నేతిలో పడొచ్చు. పద, పద.

మూర్తి: నే చెప్పలా. అదృష్టమనేది ఉంటే మంచిరోజులు వాటం తట అవే దొర్లుకొస్తాయ్ గురూ!

సూరి : శహబాస్. శిష్యా! మరి మన దారిభత్యాలు?

మూర్తి: మీ మదర్ నడిగి పట్టుకురా.

సూరి : మరి నీకో?

మూర్తి: వీలుంటే పైర్తిచేస్తా. లేదా ఇద్దరం సర్దుకుందాం.

సూరి : సరే!

( తె ర )

# న సీ బ్

## 2వ రంగం

### మదరాసులో

( మైలాపూర్ సెంటరు.కాఫీహోటలు పక్కన మూర్తి, సూరి సిగరెట్లు కాలుస్తూ నుంచొనివుంటారు.రంగారావు, రాజు అక్కడకువచ్చి సిగరెట్లు ముటిస్తారు.)

రాజు : అరేయి రంగా! నీ ప్రయత్నం యెందాకా వచ్చిందిరా?

రం : O. K.

రాజు : మరి నన్ను మర్చిపోతావా?

రం : No.

రాజు : నన్నుగురించి రికమెండుచెయ్యాలి.

రం : Ofcourse.

రాజు : (దీనంగా) తూగదంటావా?

రం : No No.

రాజు : ఆరునెలలనుంచీ పైసాలేకుండా నానాగడ్డీ కరుస్తున్నా. ఏకంపెనీకి వెళ్లినా No vacancy board. కారుఛార్జీలు లేక కాళ్లు బలపాలు కట్టుకొనిపోతున్నాయి. Friend వి ఆమాత్రం Help చెయ్యలేవురా నాకు?

రం : Brother నాదేముందిరా.ఆ డైరెక్టర్‌గాడు వక మలప దొరికాడు. నన్నే అణగద్రొక్కాలని ప్రైచేశాడు. మొదటి నుంచి నేనంటే కళకు ఒక మంచి రిగార్డు వున్నదికనక ఆ మలప నన్నేం చెయ్యలేకపోయాడు.

రాజు : కళకు నీకంటే వున్న యింటరెస్టు మరెవ్వరిమీదా లేదని నాకు తెలుసు. కనుకనే ఓల్డు ఫ్రెండ్‌ని మరిచిపోతున్నావు.

రం : మరవడంలేదు. అసిస్టెంటు అనేవాడు అక్కరలేకుండానే సర్వం తానే చేసుకుపోతానని వాగా డా డైరెక్టర్‌గాడు.

రాజు : చూడు బ్రదర్! ముందు గప్పాలు యిలానే కొడుతారు. తరువాత ముడివిరుకంతా విగుతుంది. దానికేంలే, నామాట?

రం : (గడియారం చూచి) టైమయింది. Evening wish చేస్తా. వస్తా (అని వెళ్ళిపోతాడు)

రాజు : (ముందుకు వస్తూ) ఇక్కడకు యీ అధ్యాయం అంతమై సట్లే. ఇళ నేటికి కంపెనీ పెట్టించనేసరికి నాకు సంతోషం కలిగింది. మొదటిపిక్చర్లో నా నోటివెంట చెప్పించా డెలాగున్న రిహార్సిల్సులో. నాకంటె వెనుక అడుగెట్టి యెంత పురోగమించింది! ఒదుగూ బొదుగూ లేకండా వేసినచోట కాలు కదల్పలేకుండా వున్నా నేను. పట్టుమని రెండుచిత్రాల్లో నటించిందోలేదో స్వంతంగా ఫిలింకంపెనీ పెట్టి నిర్వహిస్తున్నది. నాముందు కనులు తెరిచిన దీన్ని ఉద్యోగ మిమ్మని—అందులో అసిస్టెంటుగా—అడగటమనేది వుండే, ఏమిటో నామర్దాగావుంది. అసలు నా కాశ్చర్యమే స్తుంది—ఆడదానికి యీ సినిమారంగంలో వున్నస్థానం—మగ వాళ్ళకు మచ్చుకైనా లేదనుకోండి. ఆడది — అందులో అందమయింది—ముఖ్యంగా వయస్సులో వున్నదా, ఇహ అడిగావూ! (యిటూ అటూ పచార్లు చేస్తూ) సరె, నామాటే మిటి? ఎం చెయ్యను? రంగడైనా అందుకొని కాస్త నిచ్చెన

యెక్కాస్తాడనుకుంటే- Try and try, then you will Succede అన్నట్లు-చేద్దాం, ప్రయత్నం చేద్దాం. ఫలితం చూద్దాం. (అని వెళ్ళిపోతాడు.)

మూర్తి: వీడెవడో మంచి అనుభవమున్నవాడురా. కాకపోతే యీ నగ్నసత్యాన్ని తెలుసుకొనేందుకు మన కింతసేపు పట్టేది కాదు. తిరగవలసినచోటికల్లా తిరిగాం; చూడవలసినవాళ్ళనల్లా చూచాం. పట్టవలసినవాళ్ళ కాళ్ళల్లా పట్టాం. మదుపుకోసం చెల్లించవలసిన ముడుపుకూడా చెల్లించుకొని బుఱ్ఱ క్షౌరం చేయించుకున్నాం. కాని, యీకిటుకు తెలుసుకోలేకపోయాం.

సూరి : ఏమిట్రా ఆ కిటుకు ?

మూర్తి : సినిమాలోకంలో స్త్రీకున్న విలువ, గౌరవ ప్రతిష్ఠలు మలపల్లైన మనకు లేవని.

సూరి : స్త్రీలకు సమాజంలో గౌరవంలేదని గందరగోళం చేస్తారేమిరా ?

మూర్తి : అదొక సరసం. చదువుకున్నందుకు ఆపాటి హడావిడి పత్రికల్లోను, సభల్లోను చేయకపోతే యేలాగోయ్. రెండు చేతులూ చరుస్తేనే చప్పట్లు. లేకపోతే యేముంది ?

సూరి : సరె, తెప్పింది తిరుక్షౌరం అయింది. ఉద్యోగంమాట నాసే అయింది. ముందు గతేమిటి ?

మూర్తి : శ్రీమతి కళాదేవిగారింటికి వెళ్దాం. ఆవిడ తియ్యబోయే చిత్రంలో ప్రైవేటు చేద్దాం. అవుతుందా అవుతుంది, కాకపోతే కాలికి బుద్ధిచెప్పి సెంట్రలు చేరుకోవడం, బండిపైముకు మెల్లగా మేలు యెక్కడం.

సూరి : సరె పద.

(ఇంతలో కారు హారన్ వినబడుతుంది. ఆగుతుంది. కళ వస్తుంది. ఆవిడ్ని చూచి)

సూరి : మూర్తీ! బాగుందిరా-చూడరా (అని ఆమెవంక చూస్తూ నిలబడతాడు. మూర్తి గబగబా కారుదగ్గరకు పరుగెత్తు కొని వెళ్లి నెంబరు నోటుచేసుకుంటాడు. కళ లోపలకు వెళ్లుతుంది.)

సూరి : మూర్తి, మూర్తి! మూర్తీ! రారా బాబు రారా.

మూర్తి : ఆ వస్తున్నా, వస్తున్నా. (అంటూ కాగితం జేబులో పెట్టుకుంటాడు.)

సూరి : చూచావురా ?

మూర్తి : ఆ, చూచా.

సూరి : ఏమిట్రా ?

మూర్తి : నీ మొఖం.

సూరి : కాదురా బ్రదర్.

మూర్తి : అవున్రా బ్రదర్.

సూరి : కారులో వచ్చిన పిల్లనురా.

మూర్తి. ఆ. ఆ పిల్లనూ చూచాను. నిన్నూ చూచాను.

సూరి : అ. నీవు చూడలేదు.

మూర్తి : తగ్గు. తగ్గు.

సూరి : లేదురా బ్రదర్.

మూర్తి: అదేమిట్రా ఆలా చూస్తున్నావ్ దయ్యం బట్టినవాళ్లలా కన్నార్పకుండా. నీ కేమైనా పిచ్చి పట్టిందా ?

సూరి : కాదుండరా. అదిగోరోయి వస్తున్నది. చూడరా, కళ్ళు రెండూ పెట్టుకొని. (కళ వస్తుంది. ఇద్దరివంకా యెగాదిగా చూచి, కారుదగ్గరకు వచ్చి రెండు నిముషాలు సూరివంక చూచి కారెక్కి వెళ్లిపోతుంది.)

సూరి : పోయిందిరా, వెళ్లిపోయిందిరా బ్రదర్ !

మూర్తి : ఎక్కడకూ వెళ్లదు. యిక్కడే వుంటుంది.

సూరి : వెతుకుదాం పద.

మూర్తి: చాలు పద. పిచ్చేమన్నా పట్టిందా?

సూరి : కాదురా. ఆ అమ్మాయిని యెన్నిసార్లు చూచినా చూడాలని బుద్ధిపుడుతున్నదిరా. ఎంత ఆలశ్యమైనా వెతకాలిసిందే, కనుక్కోవాల్సిందే; చూడాల్సిందే.

మూర్తి: బాగానేవుంది వరుస.

సూరి : క్యూలా వకదానివెంట వకటి జరిగిపోవాల్సిందేరా బ్రదర్.

మూర్తి: సరేననుకో. 12మైళ్ళ పొడుగు, 12మైళ్ళ పైచిలుకు వైశాల్యంగల యీ మహాపట్టణంలో యీ నారీమణిని గాలించేది యెట్లాగోయి గురు?

సూరి : సాధించి శోధించి అభీష్టం నెరవేర్చుకోవాలోయి. అప్పుడే యే జీవికైనా తృప్తి.

మూర్తి: సరె, పద. కానీ.

సూరి : కానీలేదు అర్ధణాలేదు. నడు నడు.

మూర్తి: ఓరేయి, నే నీ పిల్లను పట్టగలనురా.

సూరి : ఆరిపిడుగా నన్ను హింసిస్తున్నావురా.

మూర్తి: నేమరా బ్రదర్. కావాలంటే ఆపిల్ల యిక్కడే వుందిరా.

సూరి : ఏది, చూద్దాం పద.

మూర్తి: ఆగు. ఆగు, ఆగాలి.

సూరి : అహ.

మూర్తి: అయితే ఆపిల్ల రావాలంటావ్. అంతేనా?

సూరి : చంపకురా నాయంఢ్రి. చెప్పనా ఎక్కడున్నదో.

మూర్తి: అయితే తప్పకుండా రావాలంటావా గురు?

సూరి : శిష్యా ఆవేశం తెప్పించకు.

మూర్తి: గురూ! కళ్ళు మూయ్యి గురు.

సూరి : (గబగబా మూర్తి కళ్ళు మూస్తాడు)

మూర్తి : (విదలించుకొని) నావి కావు గురు. నీవే మూసుకో రెండు చేతులతోటి వూ, కానియ్యి.

సూరి : (అలాగే చేస్తాడు)

మూర్తి : ఓ పిల్లా - మా గురువు నీ గురించి కలవరిస్తున్నాడు. పక్కసారి రా. రా.

సూరి : (కళ్లు తెరచి) అబ్బా - చంపేస్తున్నావురా. మూర్తి! న న్నేడిపిస్తున్నావు.

మూర్తి : లేదు, లేదు

సూరి : పిల్లా లేదు జల్లా లేదు. అంతా వట్టిగోల.

మూర్తి : విశ్వసించాలిరా వీడిమాట. అబద్ధం ఆడటం మనకు లేదురా!

సూరి : మరేంటి యీ గొడవ.

మూర్తి : ఆలశ్యం అవుతున్నకొద్దీ - చేయదలచుకున్న పనిమీద సన్నిహితం యేర్పడుతుంది. నీ మనస్సు యెట్లా బాధ పడుతున్నదో కనుక్కోవాలని.

సూరి : నీ వినోదంకోసమని యితర్లని బాధపెట్టడం అంత మంచి పని కాదురా బ్రదర్.

మూర్తి : ఏమంటున్నావ్. ఇదిగో, యీ జేబులో వుంది ఆ పిల్ల.

సూరి : ఏడిశావ్. పద, పోదాం.

మూర్తి : తగ్గు బ్రదర్ తగ్గు చూచుకో. యిదం - (జేబులోనుండి కాగితం తీసియిస్తాడు)

సూరి : M. P. M. 3056. నీ పిండాకూడు, నా పిండాకూడు. ఇదేమిటి ?

మూర్తి . బ్రదర్! బ్రహ్మాండమైన ఏదో గొడవలోపడి బుద్ధి ఖాళీ చేసుకుంటున్నావ్. ఆపిల్ల కారునెంబరు యిది. తెలిసా? యీ నెంబరుంటే యిట్టే పట్టుకోవచ్చు ఆచోకి.

సూరి : శహబాస్. ఇవే నా ధన్యవాదాలు - పద పోదాం.

[ తెర ]

# విధి

## రచన :- వైద్యుల.

విధి అనుకూల పడనప్పుడు- అనుకున్నట్లుగా జరగదు. కాని—అమాయకప్రజ తమ సంకల్పాలు యధాతథంగా జరుగుతాయి అనే కట్టు కథలు యే విధంగా పరిణామం చెందుతున్నాయి? విధి అనే నాటకం ద్వారా యీ సమస్య చక్కగా చిత్రింపబడింది. అచ్చులో వున్నది. మీ కాపీలకై వెంటనే ఆర్డరివ్వండి.

# నసీబ్

## 3వ రంగం

కళ : చూచారా రావుగారు!

రావు : చూచానమ్మా.

కళ : మనసు హీరో కావాలికదూ?

రావు : ఎందుకూ,వుండనేవున్నాడుగా కుమార్.

కళ : నాకో ఆలోచన తట్టుతున్నది.

రావు : ఏమిటమ్మా అది?

కళ : పాతవాళ్ళను ప్రతిదాంట్లోనూ యిరికించేకన్నా కొత్తవాళ్ళతో ట్రైచేస్తే బాగుంటుందని.

రావు : కట్ - కట్ (నాలిక కరుచుకుని) రిస్కు.

కళ : అనవసరంగా వేలకువేలు యిచ్చి అయినదానికి కానిదానికి వీళ్లనంతా యిరికించేకన్నా కొత్తవాళ్లతో ట్రైచేస్తే బాగుంటుంది.

రావు : నా అభ్యంతరం యేమీలేదు.పక్కాటే చిక్కు.

కళ : పంపిణీదారులు రారని,అదేనా?

రావు : అదేకాదు.

కళ : వాళ్ల విషయం మన కవసరంలేదు. డబ్బువిషయంలో మీరేమీ ఆలోచించవద్దు ఎంతైనాసరే.మనమే పంపిణీ వ్యాపారంగూడా చేద్దాం.మీరల్లా చేయవలసినది కృషి. కథాగనునం,మంచి సీక్వెన్సు,షాట్సు,సినేరియో.

రావు : పాతవాళ్లు లేకపోతే ప్రజలను మెప్పించటం కష్టమేమోనని.

కళ: అవసరమైతే నేను వేషంవెయ్యను. కథానుస్వీతంగా చిత్రం చిత్రించాలి.కథననుసరించి పాత్రలనెన్నుకుంటే- మనం హిందీచిత్రాలల్లా దిగ్విజయం పొందగలము.

రావు: సరే.అది అలా వుండండి.కథ చూశారా?

కళ: బాగానేవుంది.నే ననవసరంగా ప్రతిదాంట్లోను కలుగజేసు కోను.నిర్మాతవిధి కూడా అంతేనంటాను.నిర్మాత వసల్లా ఏ యే శాఖకు ఎవర్నెవరిని యెన్నుకోవాలో అని.ఆయా శాఖ లకు ఆయామనుష్యుల్ని యేర్పాటుచేయటంవరకే నిజంగా అప్పుడే వాళ్లు స్వేచ్ఛగా పనిచేస్తారు.ఉత్సాహంతోవున్న వాళ్ళు చేస్తూవున్న ప్రతి పని సర్వాంగసుందరంగా చేస్తారని నాకువున్న కొద్దిఅనుభవంలోను తెలుసుకున్నది.

రావు: మరి కథంతా పూర్తి అయింది. డైలాగ్సుకూడా పూర్తి అయినాయి. మ్యూజిక్ రిహర్సిల్సు పూర్తి అవుతున్నవి. నటీ నటుల యెన్నికే మిగిలింది. ఆ పనీ పూర్తి అయితే రిహర్సిల్సు ప్రారంభించవచ్చు.

కళ: ప్రకటన న్యూస్‌పేపర్లల్లో వేయించాంగదా, అప్లికేషన్సు ఏమీ రాలేదా?

రావు: బూటక ప్రకటనలని సరి అయిన వాళ్లెవళ్లూ యిందులో పాల్గొనరు. చాలా కంపెనీలు యిలాగె లోగడా ప్రకటనలు చేసి దేశం నాలుగుమూలలా తిరిగి, హడావిడిచేసి, చివ రికి పాతవాళ్లనే బుక్‌చేసి పని కానిచ్చారు. ఎవరైనా ప్రశ్నిస్తే ఎవ్వరూ సరిఅయినవాళ్లు దొరకలేదని సమా ధానం చెప్పారు.

కళ : అన్నట్లు మరిచాను. సాయంకాలం మైలాపూర్ కేఫ్ వద్ద యిద్దరు వ్యక్తుల్ని చూచాను. అందులో వకరి Face cut చాలా బాగుంది. బుక్ చేద్దాం అనుకున్నాను. కెమేరాకు సరిగ్గా సూట్ అవుతాడు.

రావు : అయితే రేపు ఆప్రాంతానికి వెళ్లి వస్తాను, కలుస్తాదేమో.

కళ : నేనూ వస్తాను. మీరు గుర్తు పట్టలేరు.

రావు : O. K.

కళ : (లేచపోతుంది)

(బాయి వస్తాడు. యిరువురికి నమస్కారం చేస్తాడు)

బాయి : సార్. యారో వందార్ సార్.

రావు : యార్?

బాయి : ఎనకు తెలియాద్ సార్.

రావు : యిప్ప పార్క ముడియాద్. (బాయి వెళ్లిపోతాడు)

కళ : (చిరునవ్వుతో) రమ్మనకపోయారా?

రావు : ఎవళ్లో వస్తూవుంటారు. వచ్చినవాళ్లందరితోనూ కూర్చుంటే మన పనికాస్తా ఆలశ్యమవుతుంది.

బాయి : (గబగబా వచ్చి) సార్. పోమాట అని సొల్లార్ సార్.

కళ : (నవ్వుతూ) వరసొల్లు. (బాయినమస్కారంచేసివెళ్లి పోతాడు.

(సూరి, మూర్తి వస్తారు. కళనుచూచి సూరి నిర్ఘాంతపోతూ ఆమెవంకే చూస్తూ వుంటాడు. కళ సూరివంక చూస్తుంది)

రావు : ఎవరు మీరు?

మూర్తి : మనుష్యులం.

రావు : (తెల్లబోయి) ఎందుకొచ్చారు?

మూర్తి : చూద్దామని.

రావు : ఇంక వెళ్లండి.

మూర్తి : చిత్తం. ఉసుటు....

రావు : ముయ్యి నోరు Get out you fool.

మూర్తి : నమాయించండి. ఆవేశం తెచ్చుకొని గెంతకండి.

రావు : Dont talk you....

కళ : (తేరుకొని) క్షమించండి. కూర్చోండి.

(మూర్తి కూర్చుంటాడు. సూరి కళవంకే చూస్తూ వుంటాడు. వాడ్ని లాక్కొచ్చి కుర్చీలో కూర్చోబెడతాడు. సూరి కళ పకళ్లనొకళ్లు చూసుకుంటూవుంటారు)

బాయి: (బాయి వచ్చి రావువంకచూచి) లెటర్ సార్. (అని పుత్తరం యిచ్చి వెళ్ళిపోతాడు.)

రావు : (పుత్తరం చదువుకొని) అర్జెంటుగా బయటకు వెళ్లాలి. వస్తా. (అని వెళ్ళిపోతాడు)

(కళ సూరివంక చూస్తుంది. సూరి కళవంక చూస్తూనే వుంటాడు.)

మూర్తి : (ఇద్దరివంకా చూచి) బాగానేవుంది వరుస.

కళ : Boy.

బాయి : సార్.

కళ : కాఫీ!

బాయి : రడీ సార్. (బాయి వెళ్ళిపోతాడు)

సూరి : (తేరుకుంటాడు. దగ్గుతాడు)

మూర్తి : వద్దండి. యిప్పుడే త్రాగొచ్చాం.

కళ : ఫరవాలేదు-కాఫీ యెన్నిసార్లు త్రాగినా ...
మూర్తి : అనవసరంగా యెందుకూ అని.
కళ : అవసరమనేది లేకుండా వుండదు చూడండి. మీగురించే అనుకుంటూయున్నాము. మీరే యిక్కడకు వచ్చారు.
మూర్తి : (తనలో) మేమూ నీగురించే అనుకుంటున్నాము.
కళ : తమ దేవూరు?
మూర్తి : ప్రస్తుతం యీ వూరే.
కళ : ఒకప్పుడు ?
మూర్తి : ఆంధ్రదేశం నడిబొడ్డు.
కళ : చాలా చక్కగా మాట్లాడుతారండి.
మూర్తి: మావాడు మూగనోము పట్టాడుగాని, నాకంటె చక్కగా మాట్లాడగలడు.
కళ : ఏం చేస్తూవుంటారు?
మూర్తి: అందరూ చేస్తున్నదే.
కళ : చమత్కారం!
మూర్తి: చమత్కారం కాదు, వైత్యకారమూకాదు.
కళ : ఇక్కడి కేం పనిమీద వచ్చారు?
మూర్తి: వున్నది చాలా పనివుంది.
కళ : అయిందా?
మూర్తి: మొదటి అధ్యాయం.
కళ : పనుల్లోగూడా అధ్యాయాలు వుంటాయా?
మూర్తి: ప్రతి దైనందిన కార్యక్రమంలోనూ వుంటాయి.
కళ : నేను మాట్లాడలేను మీతో.

మూర్తి: సూరి! నే వెళ్ళుతున్నా! నీవుహూర్లాడు. (అనిలేస్తాడు)
కళ : మరోలా అనుకోరండి.
మూర్తి:అనే మాటేనో ఆనేసి. (అనివెళ్ళిపోతాడు ద్వారందాకా?)
సూరి : (కూర్చున్నవాడల్లా లేస్తాడు.రావు, రంగా, రాజు వస్తూ వుంటారు.
మూర్తి:సుస్వాగతం స్వాగతం. Good by to all. Get up man. Come on Mr. Suri. Shall we Go?
సూరి : (కళ పంకే చూస్తూ నడుస్తున్నాడు)
(రావు యిద్దరివంకా చూచి కూర్చుంటాడు. వోమూల రంగా, రాజు నిలబడి వుంటారు)
కళ : దయచేసి కూర్చోండి. Coffee త్రాగకుండా వెళ్ళుతున్నారు.
మూర్తి:క్షమించాలి.
(బాయి మూడుకాఫీలతో వస్తాడు. టేబుల్ మీద పెడుతాడు)
కళ : ఇంకా మూడు.
(బాయి వెళ్ళుతాడు)
రావు : మనం వెళ్ళుదాం అనుకున్నాంకాదూ?
కళ : Yes. కాని....
రావు : By the by ఇతడు Mr. Raju చాలా పిక్చర్సులో అసిస్టెంటుగా పనిచేశాడు. మనకు చాలా అవుసరం. Fix చెయ్యమంటారా?
(సూరి మూర్తి వకళ్లనొకళ్ళు చూచుకుంటారు)
కళ : (కాఫీకప్పులవంక చూస్తూ) తీసుకోండి (సూరికి. మూర్తికి యిస్తుంది. అందరూ పుచ్చుకుంటారు) రాజగారా. నాకు తెలుసు. తప్పకుండా fix చెయ్యండి.

రాజు : వస్తానమ్మా.
కళ : good
రావు : రాజూ! రేపటినుంచీ రా. You are fixed and your salary will be Rs. 2 0-0-0 per a month.
రాజు : Thanks.
రంగా : రేపు ప్రొద్దుటూన్నే రండి.
రాజు : Yes. శలవు. (అందరికీ నమస్కారంచేసి వెళ్లిపోతాడు.)
కళ : డైరెక్టరుగారు! యిందాక చెప్పానే వాళ్లు వీళ్లే. good luck, ఇక్కడికే వచ్చారు. చూచాయావీర్ని. (అని సూరిని మూర్తిని చూపిస్తుంది.)
రావు : Yes.
కళ : హీరోగా బుక్‌చేద్దామా ?
రావు : O. K.
కళ : (మూర్తిని చూపిస్తూ, వీరినిగూడా బుక్‌చెయ్యండి. చాలా చక్కని హాశ్యరసపోషకులు.
రావు : O. K. రంగారావు! అగ్రిమెంట్సు పట్టుకొనిరా.
కళ : శాలరీ.
రావు : హీరోకు 300. వారికి 150.
మూర్తి: నాన్‌సెన్సు. నేనేనా తక్కువతిన్నది. we also want 300.
కళ : వకపనిచేద్దాం. పిక్చరు ఆసాంతం అయ్యేవరకూ ఖర్చులన్నీ పెట్టుకొని వకేసారిగా చెరి ఐదువేలు యిద్దాం.
రావు : O. K
మూర్తి : Thanks good. [తెర]

# న సీ బ

## 4వ రంగం

(స్టుడియోముందు మూర్తి, సూరి కారుదిగి మేకప్ రూముకు వెళ్లుతూ కేప్ట్సన్ సిగరెట్టు వెలిగిస్తూ)

మూర్తి : గురు! good shot. అదృష్టంఅంటే యిలా వుండాలి గురు.

సూరి : ఏడిశావ్ నోరుముయ్యి.

మూర్తి : నయం. అంతటితో సరిపుచ్చావ్.

సూరి : ఈ పిక్చరులో మంచి Name సంపాదించామంటే fame సంపాదించామన్నమాటే.

మూర్తి : అప్పుడు good shotగా వకదానివెంట వకటి క్యూ పిస్టం లా బుకింగ్సు జరగాల్సిందే. లక్షాధికారులం కావాల్సిందే. రోల్సురాయికారులో తిరగాల్సిందే. మదరాసు నగరంలో మంచి పసందైన మేడ కొనాల్సిందే. పక్కన పెళ్లాంతో మెరీనా బీచ్‌కి తిరగాల్సిందే. అప్పుడు వీడ్ని మరిచిపోవాల్సిందే.

సూరి : కొట్టు - కొట్టు - తైర్.

మూర్తి:అవునోయి యదార్థవాది లోకవిరోధి అన్నారు పెద్దలు. నిజమాడితే నిష్ఠూరమేగా?

సూరి : కాస్త మాటకు యెంత గందరగోళం చేస్తున్నావురా బాబు.

— ప్పునోయి నీ అదృష్టరేఖలు అలావున్నాయని నీ అర చెయ్యి నాకు చూపించి. అందుకు ఆనందం పట్టలేక మనస్సులో వున్నదంతా వెళ్ళబుచ్చాను తప్పా?

సూరి : నీవు మాత్రం అంతవాడివి కావా?

మూర్తి: ద్రోహం పెట్టేవాడి తమ్ముడిలా నేను నీ వెంట వుండాల్సింవేగా. కాని—

సూరి : ఏడిశావ్. యివంతా నీవల్ల వచ్చింది. నిన్ను మర్చిపోయి నీమేలు మరిచిపోయి తల్లిపాలు త్రావి తల్లిరొమ్ము గుద్దిన నాయకు చయ్యాను.

మూర్తి: నావల్ల వచ్చిందీ అనేకంటే నీ అదృష్టం యిక్కడకు లాక్కొచ్చి యీ అపకారం కలుగజేసిందనుకో. నే నెవడ్ని,నిమిత్త మాత్రుడ్ని.

రంగా: (గబగబా వచ్చి) Ready Sir. టైము అవచ్చింది. Make up చేసుకోండి.

మూర్తి:పానకంలో పుడకలాగా నీవేమిటోయ్ మధ్య.

రంగా : డైరెక్టరుగారు కోప్పడుతారు సెట్టుమీద అన్నిటితోపాటు ఆర్టిష్టులుగూడా Ready గా వుండాలి.

రాజు : (సిగరెట్టుదమ్ము లాగుతూ వస్తాడు,) హల్లో Mr. Suri, Come on. Don't wast time. Get up.

మూర్తి:వస్తున్నామురా బాబు, వస్తున్నాం.
(మెట్లు యెక్కబోతూవుంటాడు. ఇంతట్లో కళ గబగబా వస్తుంది.)

కళ : నమ స్తే Mr. Swri!

సూరి :- నమస్తే (అంటూ నమస్కారం చెయ్యబోతాడు.)

కళ : (వారించి) Sun Rise పిక్చర్సు డైరెక్టర్‌గారు మీకోసం కబురెట్టారు ఆఫీసుకు. మీ రషెస్ చూచారట. చాలాబాగా యాక్టుచేశారని చాలా బాగా సంతోషించారట వారు, వారి ప్రొడ్యూసరుగారూనూ, వాళ్లు తియ్యబోయే పిక్చరులో మిమ్మల్ని Book చెయ్యాలని వుందిట. స్టూడియోకి వస్తానన్నారు.

రాజు : Heartly Congratulations Mr. Suri.

రంగా : I too.

మూర్తి : O. K.

సూరి : Thanks.

[ తెర ]

# నసీబ్

## 5వ రంగం

(రాజు, రంగారావు సిగరెట్టు కాలుస్తూ ఆఫీసులో)

రంగా : రాజు : good chance రా.

రాజు : Yes Yes.

రంగా : మన పిక్చరు 99% అయిపోయింది.

రాజు : 99% పరసంటేమిటి. Only one shot more. ఆ shotతో పిక్చరు పూర్తిఅయినట్లే. తరవాత మనమాట.

రంగా : Dame shame. వెంటనే మరోపిక్చరుకు ప్రయత్నాలు ఆరంభమయితే.

రాజు : Is it ?

రంగా : కవిగారిని పిలిపించి కథకూడా వ్రాయిస్తున్నారు.

రాజు : బాగుంది. సరేగాని నాదో సందేహం.

రంగా : అసలు నీ మెదడంతా సందేహాల పుట్ట. ఊఁచెప్పు, అదే మిటో విందాం. నిన్నెందుకు కాదనాలి.

రాజు : ఇంతమట్టుకు యే డిస్ట్రిబ్యూటరూ దిగలేదుకదా, ఈ పిక్చరు విడుదల యెట్లా ? రేపు తియ్యబోయేదానికి డబ్బు యెట్లా ?

రంగా : నీ మతి యిక్కడలేదు. అందుకనే యింతకాలంనుంచీ యిట్లానే వున్నావ్. Andhra తప్ప మిగతా యేరియాలన్నీ అమ్మేశాం. Andhra లో మనమే స్వంత డిస్ట్రిబ్యూషను. ఆఫీసు బెజవాడలో పెట్టడం, పనులు జరగడం —డ—అన్నీ జరిగిపోతున్నాయి.

రాజు : నిజంగానేనా ?

రంగా : నిజమేమిటి, కళాదేవంటే సామాన్యురాలా ? అవటానికి ఆడదేగాని మంచి పకడ్బందీగా వ్యాపారం సాగిస్తున్నది. అదృష్టం కలిసిందంటే మనమంతా పరిమినెంట్ స్టాఫ్.

రాజు : నేను మొదట్లోనే అనుకున్నా. అదృష్టరేఖలు ఈ అమ్మాయివి మంచివేనని. ఈ పిక్చరు విజయవంతంగా దేశంలో దిగ్విజయయాత్ర చేయగలదని ఢంకా బజాయించగలను.

రంగా : కనకవర్షం కురుస్తుందనుకో. డైరెక్టర్ రావుగారు

కూడా మంచి పకడ్బందీగానే లాక్కొచ్చారు. ఆయన అదృష్టంకూడా బాగుండాలి. టాప్ రేంకులోకి వచ్చేస్తాడు

రాజు : Mr. సూరి ఫీల్డుకు కొత్తేఅయినా చాలాగొప్పగా నడిం చాడు. ఇంత మూమెంటు వుంటుందని నేననుకోలేదు.

రంగా: మణిపూసలన్నీ ఒకచోట చేర్చబడ్డాయి. మాల తయార్ అయింది. పసందుగా వుందని యేలావుంటుంది. కళాదేవి తోపాటు మనం–మనతోపాటు మనపిక్చరూ.నిలబడగలదని చెప్పుతున్నా.

రాజు : రంగా! నే నో మాట అడుగుదా మనుకుంటున్నాను. అడగనా?

రంగా : O.K.

రాజు : (అటూ యిటూ చూచి) మరెవ్వరితోనూ చెప్పవుగదా?

రంగా: అసలు ముందు విననీయవోయి సంగతి.

రాజు : మరేమీలేదు. కళాదేవికి వెనకా ముందూ ఎవ్వరూలేరూ?

రంగా : ఓరి నీ అసాధ్యం కూలిపోనూ, ఇదా పరమరహాశ్యం.

రాజు : (తల వంచుకుంటాడు)

రంగా: ఎవ్వరూ లేరు. వో మూల పడుంటె నేనే తీసుకొచ్చాను. ఆ సంగతి నీకు తెలుసుగా?

రాజు : అది తెలుసు. అయినా ఎవళ్ళూ లేరా?

రంగా: ఎవళ్ళూ లేర్రా. చెప్పుతున్నా విను. షూటింగు బుక్ చేసుకొని రమ్మని నన్ను పంపారు. వెళ్లుతున్నా రైల్లో. బాపట్ల బెజ వాడ మధ్య జరిగిన సంగతిది. జాగ్రత్తగా విను. ఎక్కారింది బాపట్లలో. వోపిల్ల కంపార్టుమెంటు యెక్కింది. ...మగా

సితారా మీటుతూ హృదయం కదిలించేటట్లు ఎటుగెత్తి శృతి పక్వంగా పాడుతున్నది. అంతా చెవులు నిక్కబొడుచుకొని వింటున్నారు. నేను అందులో ఏకణ్ణి అయిపోయాను. ఎంతవిన్నా తనివి తీరటంలేదు. తెనాలి వచ్చింది. 10 up క్రాసింగ్. 15 నిముషాలు ఆగింది బండి. ఆ పిల్ల దిగిపోతున్నది. నేనూ దిగాను. "అమ్మాయి! నాతో వస్తావా? నిన్ను సినిమా కంపెనీలో చేరిపిస్తాను" అని అన్నాను. నీకీర్తి దేశం నాల్గుమూలలా వ్యాపిస్తుం దన్నాను. వస్తానన్నది. వెంటనే నేను దిగాను. Expressలో మళ్ళీ తిరిగి Madras వచ్చాం. 1st Pictureలో బుక్ చేయించా. మొదటి చిత్రంలోనే Top most star అయిపోయింది. ఆ పిల్లే మన కళ.

రాజు : అందుకే నీవంటే అంత రిగార్డు.

రంగా : అవునోయి ఎంత మంచిగుణం. చస్తే వస్తుందా అందరికీ. కాస్త పేరు వచ్చేసరికి కళ్ళు నెత్తికివచ్చి గతచరిత్రను మరచి నడుస్తున్న వాళ్ళని మన కళ్ళముందు యెంతమందిని చూడటంలేదూ?

రాజు : నిజం. నిజం.

రంగా : కులం యేదైతేనేం. యెంత మంచి గుణవంతురాలు. ధర్మ సమస్తలకు యెన్నింటికి గుప్తదానం యిచ్చిందో నాకు తెలుసు.

రాజు : బిగ్గరగా అరవకు. ఏ చలపాదివెధవ చెవిలోనో పడితే ఈమాట, రాబందుల్లా పీక్కుతింటాగ ఈ గోడల్లో

కుంటీ గుడ్డివాళ్లకన్నా ఘరానా మనుష్యులు ఏవో సమ
స్తల పేరుజెప్పి దోచుకుంటున్నారు.

రంగా : నీకెందుకు మధ్యన. నాకెందుకు యీ విషయం (టైము
చూచి) డైరెక్టరుగారు వచ్చేవేళ అయింది.

రాజు : చూడు, వక్కమాట.

రంగా : నే చెప్పలా నీ మెదడంతా సందేహాలపుట్ట అని.

రాజు : కొత్తహీరో అంటే కొత్త free గా వుంటుందనుకొన్నావేంటి?

రంగా : దేం నాన్‌సెన్సు! ప్రతివాళ్లతోనూ free గా వుంటుంది.
అరవకు అనవసరంగా.

(బాయి వస్తాడు)

బాయి : సార్ అయ్యా వందరికా సార్. (వెళ్లిపోతాడు)
(డైరెక్టర్ రావు వస్తాడు.)

రాజు :
రంగా : } good morning.

రావు : Very good morning. రంగారావు! కాల్‌షీట్ ఎప్పు
డరేంజి చేశావు.

రంగా : రేపు నైట్టుకు.

రావు : ఆవిడ్ని కలుసుకున్నావా? రేపుతీరుబడి వుంటుందో వుండదో.

రంగా : No. No. she is free.

రావు : Right. రాజు! నోట్సు రాశావా ?

రాజు : Yes sir.

రావు : పదండి పోదాం.

[తెర]

# న సీ బ్

## 4వ రంగం

సూరి : (వస్తాడు) యింతవరకు బాగానే నడిచింది, మూర్తికి ముందుచూపు బాగావుంది. వాడు పట్టుపట్టకపోతే ఈ రోజున నే నిలా నిలబడలేను. వాడన్నట్టు అదృష్టం అనేది పక్కనె వుండాలిగాని - ఇన్నాళ్టికి నేను మా నాన్నకు కావల్సివచ్చాను. నిజంగా యీ వుత్తరం మా నాన్నే వ్రాశాడంటె నమ్మను. అమ్మబలవంతం జాస్తీగా వుంటుంది. కన్నప్రేమ పట్టిపోతుందా? అమ్మనుచూడ నే నా యింట్లో వుండగలిగాను గాని, హృదయమనేది యేకోశానా లేని నాన్నను చూచి కాదు. (ఉత్తరంచూచి) "అమ్మ నిన్ను చూడాలని కలవరిస్తున్నది. వెంటనే బయలుదేరి రా" ఈ మాటలోనే నే చెప్పేదానికన్నా నాన్న స్వభావం అర్ధమవుతున్నది. ఇప్పుడు యింటికి వెళ్ళడమా వెళ్ళక పోవడమా? (అని) తప్పకుండా వెళతాను. ఆ పవిత్ర మూర్తిని- నన్ను గన్న తల్లిని కనులారా చూస్తాను. ఆమె ఆశీర్వాదం పొందుతాను.ఆవిడ్ని కష్టపెట్టి నేను బావుకొనేది యేముంది. తప్పకుండా వెళ్ళుతాను. (ఆగి) కంపెనీ శలవు యిస్తుదో యివ్వదో. పిక్చరు పూర్తికావచ్చింది. రోజు రోజూ షూటింగ్ పెడుతున్నారు. శలవు దొరకటం కష్టమే. అయినా ప్రయత్నంచేస్తాను (అటూ యిటూ చూచి)కళాదేవి లేనట్లుందే. (గోడకు వేళ్లాడుతూవున్న ఫొటోవంక చూస్తాడు. దానిముందు చక్కగా అలంకరించి వుంటుంది.

దగ్గరకు వస్తాడు. అటువేపే చూస్తూ వుంటాడు. పక్కన కళాదేవి ఫొటో వుంటుంది. దాని పక్కనే తన ఫొటో వుంటుంది) కలా యిది? (కళ వస్తుంది. చూస్తుంది. వెనకాతలే వెళ్లి నిలబడుతుంది. సూరి వెనక్కు తిరగకుండానే అలానే చూస్తూవుంటాడు)

నేను పొరబడుతున్నానా ? ఇది నిజమేనా ? నా ప్రేమనే గోడుతున్నదా ? ఆహా ! యెంతో అందం కలది కళ. సాక్షాత్ కళామూర్తి. బ్రహ్మ ఆమెను సృష్టించడంలో అన్యాయం చెయ్యలేదు. ఏ దేవకాంతగానో పుట్టవలసిన స్త్రీ.

కళ : Mr suri:

సూరి : (వెనక్కు తిరిగి కళనుచూచి తల వంచుకుంటాడు.)

కళ : (సూరివంక చూస్తూవుంటుంది.)

సూరి : (వెళ్లబోతూ వుంటాడు.)

కళ : వెళ్లుతున్నారా ?

సూరి : (ఆగుతాడు)

కళ : ఏదో పనిమీద వచ్చినట్లున్నారే?

సూరి : (తలవంచుకుని) లేదు.

కళ : కూర్చోండి.

సూరి : వెళ్లుతా.

కళ . ఫరవాలేదు కూర్చోండి.

సూరి : (సోఫాలో కూర్చుంటాడు)

కళ : (లోపలకువెళ్లి రెండు కప్పుల కాఫీతో వచ్చి-వకటి సూరికి యిస్తుంది)

సూరి : ఇప్పుడే ....

కళ : నేనే స్వయంగా తయార్ చేశాను.

సూరి : (తాగుతాడు)

కళ : ఎలా వుంది ?

సూరి : చాలా బాగుంది.

కళ : మాటవరసకు.

సూరి : కాదు యదార్థంగానే.

కళ : ఒంకార సరిపోయిందా ?

సూరి : అన్నీ యాచినట్లుగా వున్నాయి. రుచిచూచి అబద్ధం యెలా చెప్పను.

కళ : ముఖస్తుతి.

సూరి : (మాట్లాడడు)

కళ : పని చెప్పారుకారు ?

సూరి : ఏమీలేదు. చూచి వెళ్లుదామని.

కళ : కాదు. ఏదో వుంది.

సూరి : మరేమీలేదు. వస్తా.

కళ : Next picture గూడా ఆరంభిస్తున్నాను.

సూరి : సంతోషం.

కళ : మీరే హీరో వెయ్యాలి.

సూరి : తప్పకుండా.

కళ : తీరిక వుంటుందా ? చాలావాటిల్లో బుక్ అయినట్లున్నారు?

సూరి . అదంతా మీ చలువ. మీ దయ అనేది లేకపోతే నేనింత వాడ్ని అయ్యేవాడ్నికాదు.

కళ : మీలోవున్న విశిష్టత ఆస్థానం కలుగచేసింది గాని. మా దయేముంది?

సూరి : ఆ అవకాశం కలిగించేవాళ్లుండవద్దూ? ఈ అవకాశం కోసం యెంతమంది నివురుగప్పిన నిప్పులా వుండిపోవడంలేదు.

కళ : నిజమే.

సూరి : మీ అభిప్రాయాలు మంచివి. అందుకనే యింత కొద్ది కాలంలోనే యింత స్థానాన్ని ఆక్రమించుకున్నారు. మీ కన్నా ముందు వున్న వాళ్లంతా ఎదుగూ బొదుగూ లేని గొడ్డుతోకలా ఉన్నారంటే వాళ్లల్లో మీవంటి ఆశయాలు లేవుగనుకనే.

కళ : (మాట్లాడదు)

సూరి : కళ కళ కళా అని యెలుగెత్తి అరిచేవాళ్లేగాని ఆచరణలో అమలు పరిచేవాళ్లను వేళ్లమీద లెఖ్ఖబెట్టాలి. మీ దీక్ష, మీ కళారాధన ఆసేతు హిమాచలం ఎలుగెత్తిపోతున్నది. (మూర్తి గబగబా వస్తాడు. యిద్దరినీ చూసి తలూపి)

మూర్తి : బాగుంది. రైలుపట్టాలు వుచ్చుకో యింక. త్వరగా రారా బాబూ అంటే కబుర్లలో పడ్డావు. నీతో యేది తలపెట్టినా యింతే.

కళ : ఏమిటా హడావిడి. రండి? కూర్చోండి.

మూర్తి : ఆ, కూర్చోవాల్సిందే. ఏం చేస్తాను కూర్చోక.

కళ : ఏం అంత విసుగ్గా వున్నారు?

మూర్తి : వుత్తరం వచ్చింది యింటిదగ్గరనుంచి రమ్మనమని. వెళ్లుతానని కూర్చున్నాడు. సరే, బయలుదేరమన్నా. వస్తా ముందు నీవు పద స్టేషనుకు అని అన్నాడు. వెళ్లా. బళ్ల

రెండూ కదలిపోయినాయి గాని, యీ దొరగారు కదలి రాందే.

కళ : ఏమిటి సంగతి?

మూర్తి : సంగతేముంది. వాళ్లమ్మ చూడాలనుకుందిట. వుత్తరం వ్రాశాడు తండ్రి రమ్మనమని. బయలుదేరుతున్నాడు యీ మహావీరుడు.

కళ : మంచిదే.

మూర్తి : ఎవరు కాదన్నారు. నేనూ వెళ్లమనే అంటున్నాను కానీ——

సూరి : నేనూ ఆ సన్నాహంలోనే వున్నాను.

మూర్తి : తెలుసురా బాబు, తెలుసు. నాకు పూర్తిగా తెలుసు. కళాదేవిని చూస్తూ కొన్ని నెలలైనా అన్నాహారాలు లేకండా కూర్చుంటావని.

సూరి : మూర్తీ!

మూర్తి : సూరీ!

సూరి : ఏమిటి యీ మాటలు.

మూర్తి : తప్పేముంది. ఆరోజు మైలాపూర్ సెంటరులో చూచావు. ఆనాటినుంచి నీ కీ జాడ్యంపట్టుకుంది. వూ, కానీ. ఈ రోగం యెలా కుదురుతుందోగానీ——

కళ : (చిరునవ్వుతో మాట్లాడబోతుంది)

సూరి : ఆ నోటికి హద్దూ పద్దూ వుండాలి.

మూర్తి : నీ చేతలుగూడా కొద్దిగావుండాలి.

సూరి : నీకు మతిపోయింది.

మూ_ర్తి : నామాటకేంగాని, నిజంగా నీకు మతిపోయింది. ఇంకా కొద్దిరోజులు యిలానేవుంటే పూ_ర్తిగా పోతుంది. ఏ యెరుకలపూడో విశాఖపట్టణమో పంపాల్సివస్తుంది.

సూరి : కేతిగాడివిరా.

మూర్తి : అవున్రా బాబు, అవును. ఇంకా అంటావు. అను. మంత్ర సానితనం వొప్పుకున్నాక పడాలిరా బాబు పడాలి. తప్పు తుందా మరి.

సూరి : బాబు నమస్కా_రం మాట్లాడకు.

మూర్తి : మంచి చెప్పినా చెడేరా యీ రోజుల్లో. కళాదేవి! నీవైనా చెప్పమ్మ కా_స్త.

సూరి : ఛీ నోరుముయ్యి. హాశ్యానికి హద్దూ పద్దూ వుండాలి.

మూర్తి : మాటలు జా_స్తీ అవుతున్నాయి.

సూరి : నీ అతివాగుడు.

మూ_ర్తి : కళాదేవి! మావాడికి మతిపోవటం నిజం. కా_స్త జాగ్ర_త్త పడకపోతే మనకు దక్క_డు.

(కళ సూరివంక చూస్తుంది. సూరి కళవంక చూస్తాడు)

మూర్తి : అసలు కొంపకు వెళ్లడమనేది వుందా?

సూరి : (మాట్లాడడు)

( తె ర )

# నసీబ్

## 6వ రంగం

మూర్తి: నాకు తెలుసుగా యి జబ్బుకు లక్షణాలు.

సూరి : (మాట్లాడడు)

మూర్తి : నీ వెట్లాగన్నా ఏడు. నే పోతున్నా. (వెళ్లిపోతాడు)

కళ : వెళ్లారుకారేం?

సూరి : కళ! (పెదిమ కొరుక్కొని) కళాదేవి!

కళ : ఆం.

సూరి : కళ! నన్ను నీవాడ్ని చేసుకో కళ. నిన్నువిడచి వక్క నిముషమైనా వుండలేను కళ. తొలిసారి నిన్ను చూచి నప్పుడే నిశ్చయం చేసుకున్నాను కళ.

కళ : ఏమంటున్నారు?

సూరి : నీ విచ్చిన వుద్యోగం కోసం రాలేదు కళ. నిన్ను చూద్దా మని వచ్చాను. నీ వుద్యోగాన్ని అంగీకరించటంలోగల అంతరార్థం యిదే కళ! నిన్ను విడచి వక్క నిముషమైనా వుండలేను కళ.

కళ : (అతని వంకే చూస్తూ వుంటుంది)

సూరి : నీవూ నేను ఏడుతూవున్న అవస్తలోనే వున్నావని యిప్పుడే యింతకముందే నీ వలంకరించిన ఫొటో చూచి తెలుసు కున్నాను కళ. కళ! కళా! (అని కౌగలించుకోబోతాడు)

కళ : దౌర్జన్యం!

సూరి : సాక్ష్యం నీ ఆత్మ: తెలుసు నీమనస్సు. నాకు అందరాని ఫల మని ఆసించాను. అయినా నా ఆశ నిరాశ చేసుకోలేదు

ఏ నాటికైనా ఫలించదా అని. అది నేడు ప్రత్యక్షంగా చూచాను. నన్ను తోసి రాజనలేవు. నిన్ను నేను హృదయ పూర్వకంగా కోరుతున్నాను.

కళ : నన్ను వివాహం చేసుకుంటారా?

సూరి : తప్పకుండా. ముమ్మాటికీని.

కళ : కుల గోత్రాలు?

సూరి : అవసరంలేదు.

కళ : సంఘం?

సూరి : మనకు దూరం.

కళ : నాలోవున్న ఆధిక్యత?

సూరి : మనస్సు. నీరూపం, నీగుణం నన్ను ముగ్ధుణ్ణి చేసినాయి. అదేనాకు కావలసినది.

కళ : తల్లి దండ్రులు?

సూరి : కళా! కళా!! అహ్హాహ్హా! తల్లి దండ్రి- ఈ పేర్లలోనే నేను కృంగిపోయాను. కృశించాను. ఇప్పుడు నేను స్వేచ్ఛాజీవిని. నా స్వేచ్ఛకు యెవ్వరూ అడ్డుపడలేరు.

కళ : మాట తిరుగరుగదా?

సూరి : అటు సూర్యుడు యిటు వుదయించినా.

కళ : నా పూర్వ జీవితం?

సూరి : అక్కరలేదు. నా కక్కరలేదు. నాకు కావలసినది నీ నిర్మల ప్రేమ.

కళ : ముమ్మాటికీ?

సూరి : ముమ్మాటికి (అని చేతిలో చెయ్యివేసి వడిలోకి లాక్కుంటాడు) ( తెర )

# నసీబ్

## Last Seen

కళ, సూరి Make up లో వుంటారు. రావు, రాజు వక Angle లో నిలబడి అడ్జెస్టిమెంటు చేస్తూ వుంటారు.

రావు : Yes, one Rehearsal. silense. Mr. Suri! this is last Shot and more over this is end Seen. you have to take good pains. Start.

సూరి : రాజా! చివరకు జయం మనదే. న్యాయం జయించి తీరుతుంది.

కళ : ఆ పావురాల జంట యెంత అందంగా వున్నాయో!

సూరి : ఔను. యిటుచూడు, యీ తామరతూండ్లు వకటి నొకటి ఎలా పెనవేసుకున్నాయో!

కళ : ప్రకృతి ప్రేమమయం!

రావు : Cut, Cut. O. K. Now come on. Final. Mr. Raju! No. Please.

రాజు : Boy No. 75/16 నసీబ్.

రావు : Start.

కళ : నామదిగల కోరిక యీడేరెగా

సూరి : నామదిగల కోరిక నెరవేరెగా

కళ : ఈనాటికి

సూరి : నేటికి

కళ :
సూరి : } మదిగల కోరిక లీడేరెగా.

మూర్తి : ఈ ఆనంద సమయంలో నూతన వధూవరులకు యివే నా శుభదీవెనలు. (అంటూ యిద్దరిమెళ్లో పూలదండలు వేస్తాడు)

రావు : Cut. O. K.

రాజు : O. K.

రంగా : O. K.

(అందరూ చప్పట్లు కొడతారు)

[తెర]

వై ద్యు ల వా రి మ రో నా ట కం

# బా ని స

కట్నాలిచ్చి భర్తలతో పుస్తె కట్టించుకునేది కన్నెచెర నుండి బయట పడేందుకే.

కాని భర్తగా మనే వ్యక్తిపై భార్యకుండే సంబంధం యెంతవరకు ?

ఆదిలో ఆడపిల్లలకు వరులు కట్నమిచ్చి పుస్తె కట్టారు. మధ్యలో మగపిల్లలకు కట్నాలిచ్చి ఆడపిల్లలకన్యచెరమాపారు.

నేడు, కట్నాలిచ్చి వరుల చేతుల్తో పుస్తెకట్టించుకున్నా భర్తలను బానిసగా చూస్తున్నారు.

ఇదెంతవరకూ నిజం ?

బానిస అనే యీ నాటకం మీ అనుమానాన్ని నివర్తి చేస్తుంది ?

వెంటనే మీ కాపీలకై ఆర్డరివ్వండి.

శ్రీతంరాజు వెంకటేశ్వరరావుగారి

## నా ట కా లు

రు. 1-8-0

ఈరోజు (అచ్చులో వుంది.)

రాయసం వెంకట రమణయ్యగారి

## ర చ న లు

మరామత్ (ద్వితీయ ముద్రణ)

బహిష్కరణ డిటో

విద్యాపతి డిటో

"పేరిగాని ప్రతాపం" (అచ్చులో వున్నది)

(గొప్ప హాశ్యరస నాటక ప్రహసనము)

ప్రచండ భీమన (అచ్చులో)

జాతీయ గీతాలు డిటో

**వివరములకు:—**

# వి జ య ప బ్లి కే ష న్స్,

7/319 సీతన్నపేట. విజయవాడ-2.

# విజయ పబ్లికేషన్స్‌వారి ప్రచురణలు

## వైద్యుల శ్రీనివాసరావుగారివి :

| | | |
|---|---|---|
| బానిస | (సాంఘిక నాటకం) | (అచ్చులో) |
| విధి | .. | .. |
| సర్తకి | .. | .. |
| దీక్ష | .. | .. |

## సీతారాజు వెంకటేశ్వరరావుగారివి :

| | |
|---|---|
| పేద పడుచు | (నాటకం) |
| ఈ లోకం | .. |
| ఈ రోజు | .. |
| సినిమా జగత్తు | .. |

## రాయసం వెంకట రమణయ్యగారివి

| | |
|---|---|
| బహిష్కారణ | (జాతీయ నాటకం) |
| ముఖమ్మతు | .. |
| విద్యాపతి | (సాంఘిక నాటకం) |
| ఆడపడుచు | .. |
| పేరిగాని ప్రతాపము | .. |
| ప్రచండ భీమస | .. |
| శకుంతల | .. |

పబ్లిషర్సు :

**విజయ పబ్లికేషన్సు, విజయవాడ-2.**